# స నా త న సా ర థి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము


సంపుటము 15 నవంబర్ '72 సంచిక 10


విషయానుక్రమణిక

—:చిత్రములు:—

వేదపురుషుడు: సప్తాహయజ్ఞముయొక్క పూర్ణాహుతి మహోత్సవమందు
ప్రశాంతి మందిరము (8-10-1972)



:శ్రీ వారి కార్యక్రమములు:—

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసి కొనగోరు భక్తులు ఎడిటర్, సనాతన సారథి, ప్రశాంతి నిలయం పోష్టు. పెనుకొండతాలూకా అనంతపురం జిల్లా. అనే విలాసమునకు రిప్లయికార్డుగాని రిప్లయిపెయిడ్ టెలిగ్రాంగాని పంపితే కొత్తచెరువు 30 PCO ఫోన్ చేసితే తెలుపగలము

చందాదారులకు విజ్ఞప్తి

రసీదు నంబర్లు TC 7610 నుండి 8168 వరకు చందాదార్లు తమరసీదులనుచూచి జనవరి. 73 సంచికనుండి కట్టవలసిన క్రొత్త చందాలు (రు॥4) ఇదివరకు పంపనియెడల. కార్యాలయమునకు డిసెంబరు 72. 15వ తేదీలోపల చేరునట్లు పంపవలయును.



# రామ కథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

## 34

### సత్యధర్మములు

లక్ష్మణుణ్ణి చూస్తూ రామచంద్రుడు, "తమ్ముడా! నీకు నామీద యెంత అనురాగమున్నదో నేనెరుగుదును. నీపరాక్రమము, బలము, ప్రభావము కూడనూ నాకు తెలియనిదికాదు, సత్య స్వరూపములు తెలుసుకొనలేక తల్లియైన కౌసల్య మహా దుఃఖమును అనుభవించుచున్నది. అంతియేకాక కన్నకడుపగుటచే చేత, ఇట్టి బాధ సహజమే. కానీ సకల పురుషార్థములకూ ధర్మమే మూలము. ధర్మము, సత్యము మిదనే నిలచియున్నది. సత్యము లేక ధర్మము నిలువజాలదు.

సత్య ధర్మములు రెండునూ అవినాభావసంబంధము. పితృవాక్య పరిపాలనచే నాకు ఇప్పుడు సత్య ధర్మములు రెండునూ సమకూరుతున్నవి. తల్లికికానీ తండ్రికికానీ పెద్దలయిన గురువులకుకానీ మాటయిచ్చిన తరువాత ధార్మికుడైనవాడు ఎవడునూ తప్పడు; తప్పకూడదు. అందువలన పితృ ఆజ్ఞను నేను అతిక్రమించను.

నన్ను ఆజ్ఞాపించినది కైకేయి కాదు; పితృాజ్ఞను అమె నాకు అందించినది. అట్లు అందించుట అతని సన్నిధియందే కనుక దానిని శిరసా వహించవలసినదే; అట్లు పితృ ఆజ్ఞయే కాకుండిన కైకేయీదేవి పితృఆజ్ఞగా నాకు తెలుపుచుండినపుడు తండ్రి, ఇదినా ఆజ్ఞకాదని చెప్పియుండవచ్చునుకదా. అట్లుచెప్పక. వూరక విలపించుచుండెను కనుక, అతను అంగీకరించినటులే కాన నేను నాసంకల్పమును మార్చుకొనను; మార్చుకొనుటకు వీలులేదు.

నీవు వూరక భయంకరమైన క్షత్రియ ధర్మముమీదికి నీబుద్ధిని పోనీయవద్దు! క్రౌర్యమువీడి నాపద్ధతిని అవలంబింపుము, అని లక్ష్మణుని చెంతకువెళ్ళి విచారముతో కృంగిపోవుచున్న అతని వీపును నిమిరి పరమశాంతముతో ప్రేమవచనములతో వోదార్చుటకు పూనుకొనెను. తరువాత

## అరణ్యరాజ్యము, అయోధ్యారాజ్యము

తల్లియైన కౌసల్యవైపున చూచుచూ, అమ్మా! నాతలంపునకు అడ్డుతగిలి నావ్రతమును భంగపరచవద్దు; నేను యే

వెట్లు జరిగినను అరణ్యమునకు పోకతప్పదు నీవు ప్రేమతో అనుమతించి పంపుము, ఆశీర్వదించుము, అని మోకాళ్ళపై వంగి నమస్కరించుచున్న రాముని చూచి తల్లి కుమిలిపోవుచూ, దుఃఖములను మ్రింగుచూ, రాముని వీపున చేతులుంచి బోరున యేడ్చుచుండుట రాముడు భరించలేక, తల్లిపాదములపట్టి, అమ్మా నామాట పరమసత్యము! వనవాసమునందు నాకెట్టి ఇక్కట్లునూ సంభవించవు; అత్యంత ఆనందముగా సుఖముగా ఈ పదునాలుగు సంవత్సరములూ గడిపి తిరిగి నేను తమసన్నిధికి వచ్చి వ్రాలగలను. తమ అభీష్టమును నెరవేర్చగలను. అమ్మా! దశరథుని ఆజ్ఞను నేనేకాదు నీవు లక్ష్మణ సుమిత్రా భరతశత్రుఘ్నులు సహితము నెరవేర్చవలెను; శిరసావహించవలెను. ఇదియే సనాతన ధర్మము.

తల్లీ! మరొకమనవిని మన్నించవలెను. నాకొరకై యేర్పరచిన, సమకూర్చిన సంభరాలను నీవు సంతోషముగా సమానప్రేమతో భరతుని రాజ్యాభిషేకమునకు ఇచ్చివేయవలెనని ప్రార్థింతును. నాకు అరణ్యరాజ్యమును అప్పజెప్పెను నాన్నగారు. అయోధ్య రాజ్యమును భరతునకు అందించును. యెవరెవరిబాధ్యతను వారు నిర్వర్తించుటయే పరమధర్మము. కర్తవ్యమును నిర్వర్తించక, కఠినమని తలంచుట, పుత్రునకు సరికాదు తల్లియైన నీవు రాముడన్నను, భరతుడన్నను భేదములేక ఇరువురి బాధ్యతలను సక్రమముగ కొనసాగించుమని కోరి ఆశీర్వదించుచేటే తమ

పతికి సతి అర్ధాంగి

విధి'' అంత కౌసల్యాదేవి రామమాటలను అలకించుచూ, భరించలేని దుఃఖముతో నేలకూలి, ''నాకొడుకా! శరీర సంబంధమునందును, పెంచి పెద్ద చేయుటయందును నీకు నీతండ్రి . యెంత పూజ్యుడో నేనునూ అంత పూజ్యురాలనే కదా? అంతియేకాక పతికి సతి అర్ధాంగి, అనగా. పతిలోని యెడమ భాగము సతి; సతి లోనీ కుడి భాగము పతి. ఈ విధముగా వకరిలో వకరి అర్ధ భాగము సతి పతులయి వుండ నేను దశరధుని లోని అర్ధభాగము అగుట చేతనే నన్నూ అర్ధాంగి అని పిలుచుట నీకు తెలియదా! ఈ నాడు నీతండ్రి నాకు ఆజ్ఞ ఇచ్చెనని చెపుటలో అర్ధ ఆజ్ఞే కానీ పూర్తి ఆజ్ఞకాదుకదా మిగిలిన పూర్తి అజ్ఞకావలెనన్న నేను కూడనూ సమ్మతించినపుడే నీవు పరిపూర్ణఆజ్ఞను పాటించిన వాడవగుదువే కానీ లేకున్న అట్టిది ఆజ్ఞ క్రింద సమకట్టుట సరికాడనునది కూడనూ విచారించవలెను.

మాతృ ఆజ్ఞప్రధానము

సర్వ ధర్మములూ తెలిపిన నీవు ఈధర్మమును కూడనూ యోచించవలెను, కదా? తల్లిఆజ్ఞలేకయెట్టిధర్మము పూర్ణరూపమునుధరించదు, కానేరదు, పితృఆజ్ఞకంటే మాతృఆజ్ఞ అతిప్రధానము. కనీ పెంచి పెద్దచేయునది తల్లికానీ తండ్రికాదు. నవమాసములు తల్లియే భరించ

కున్నా పుత్రుడే లేడుకదా? అట్టితల్లిని శోకాగ్నిలో వేసి తండ్రిఆజ్ఞతండ్రిఆజ్ఞఅని నీవుతండ్రికేప్రధానమునందించుట నేనేనాటికినీ అంగీకరింపను, ఇదినీకు తగినదికాదు తల్లికి కొడుకునకు మించిన ధనము వేరులేదు. అందునా నాబోటి తల్లికి, కొడుకే సర్వము. కొడుకు కడగండ్ల పాలు చేసి పితృఆజ్ఞ అని దానిని అంగీకరించిన, నాకు పర లోక ప్రాప్తి, స్వర్గలోకమున అమృత పానము చేయు ప్రాప్తి, లభించియు ఫలమేమి? నేను నరకము ననుభిం చిననూసరే నాకొమరుడు నాచెంతయుండిన, లేక నేను కొమరునిచెంతయుండిన అంతేచాలు; అదేనాకు సర్వము

రామా! ఇక్కడుండి మాత్రము నేనుచేయున దేమున్నది? నాజీవితములో యేనాడుమ నేను సంతోష మనుభవించ నోచుకొనలేదు. పుట్టినదిమొదలు తల్లిదం డ్రుల ఆజ్ఞలను అనుసరించి, కడకు యెట్టిపతి లభిం చునో యెట్లుండునో అను విచారముతో కుములుచుం డ, పెండ్లి ఆయెను; కొన్నిసంవత్సరములు పుత్రులులేర ను విచారముతో కాలము గడిపి తరువాత సవతు లతో పోరుపడితిని: ఆనాటి మొదలు నేటివరకు ఆ బాధలు తప్పలేదు.

యేజన్మ నోము ఫలమో, నిన్నుకొడుకుగా వడసితిని ఇంతలో నీవియోగము ఈరీతిగా సంభవించు చున్నది. యేనాడు సుఖము? జీవితమే వక దుఃఖ సాగరమయి

అందులో పడి గట్టు చిక్కక, ఈదలేక, మునకలు వేయుచున్న నాకు రామాధారము వక పట్టుకొమ్మగా వుండెను? నేడు దానిని కూడనూ వీడిన ఇక నాగతి యేమగునో బాగావిచారించుకో, నాయనా.

నేను లేకపోవుటచేత మీతండ్రికే కొరతయూ వుండదు. అతని ఆనందము కైకతో చేరినదేకానీ, మరెవ్వరూ అవసరముండదు కాన ఇక్కడవుండి ఈరీతిగా రాత్రింపగలు కుమిలి తుదకు ప్రాణములు విడుచుటకంటే, నాముద్దు కొమరుని మోమును చూచుచూ. అరణ్యములో అన్నపానాదులు లేకయిననూ హాయిని అనుభవింతును అని, పరిపరివిధముల విలపించుచున్న కౌసల్య వాక్యములు రామచంద్రునకు సరియైనవిగా తోచిన

మరొకప్రక్క, తండ్రి ఆజ్ఞను శిరసావహించక తప్పదన్న శపథము తనను వత్తిడి పెట్టుచుండెను. ఇంతలో లక్ష్మణుడు. "అన్నా! తల్లివాక్యములు పరమసత్యములు. తండ్రికంటే తల్లిప్రధానము. అందువలననే శాస్త్రము, "మాతృదేవోభవ పితృదేవోభవ "అని మాతృస్థానమునకు ప్రధానత యిచ్చినది. నీవు అంత పట్టుపట్టి మాతృదేవిని బాధపెట్టుట మంచిదికాదు, అని తెలుపగనే.

### ధర్మము సమకూరే పని

రాముడు, "లక్ష్మణా! పుత్రవాత్సల్యముతో పరితపించు

తల్లిమాటలనే నీవు పాటించు చున్నావుకానీ రాజ్యమునకు, యావత్ ప్రపంచమునకు, ప్రజలకు, సంబంధించిన పితృవాక్యమును నీవు విచారము చేయకుండుటలో వున్న అంతరార్థమేమి బోధపడుటలేదు. వక్క ధర్మము వలననే అర్థ కామ మోక్షములను మూడు పురుషార్థము లూ సమకూరును. ఇందులో సందేహమక్కరలేదు. భార్య అనుకూలవతిఅయి ధర్మాన్ని అభిమతమయి. కామాన్ని సుపుత్రఅయి అర్థాన్ని సమకూరుస్తుంది. అదేవిధముగా ధర్మానుష్ఠానమువలన ధర్మమూ, అర్థ మూ, కామమూ, మూడూ యేపనివలన సమకూరవో ఆ పని చేయకూడదు. కేవలము అర్థపరుడయిన వానిని లోకము ద్వేషిస్తుంది. కేవలము కామపరత్వము అప్రశస్త ము. అందువలన, ధర్మము సమకూరేపని చేయవలెను.

లక్ష్మణ! అంతేకాదు! దశరథమహారాజు మన కు తండ్రి, గురువు, రాజు, అయన కోపమువల్లకానీ కామమువల్లకానీ, ప్రేమవల్లకానీ, యేమి ఆజ్ఞాపించినా మనము చేసేతీరవలెను. పాపకర్ముడయిన కొడుకు తండ్రి చెప్పినది చేయకపోవచ్చు. నేను అట్లుకాదు. నాన్నగారు యేమిచెప్పినా, నేను శిరసా వహింతును. ఇందులో నీకు కొంతసందేహము కలుగవచ్చును. తండ్రి మూర్ఖుడయి కామాంధుడై నిత్యానిత్య పరిజ్ఞానములేక తనస్వార్థమునే లక్ష్యమందుంచుకొని, పరుల మాటలను నమ్మి కన్నకొమరుని కష్టపెట్టుటలో అనుసరించు

అధర్మమును కూడనూ కొమరుడు విశ్వసించవలసినదేనా అని నీవనవచ్చు. తప్పక! విశ్వసించవలసినదే. మూర్ఖుడయిననూ అజ్ఞాని అయిననూ అతనికి నీవు కొమారుడవే; దీనిని విశ్వసించినపుడు మిగిలినవన్నియూ దానికితగ్గు స్థాయినే కాని అధిక స్థాయివికావు.

శాశ్వతకీర్తి నికోల్పోవుటమంచిదికాదు

తండ్రి అని విశ్వసించిన కొమారునకు తండ్రి చెప్పు విషయములను కొంత అస్తవ్యస్త మయినవిగా వుండిన వాటిని విపులముగా వివరించి తండ్రికి నచ్చచెప్ప వచ్చునేకానీ తాను చెప్పునవి అవివేకముమైనవిగా భావించి, తిరస్కరించరాదు. అందునా దశరథమహారాజు మహామేదావి, శూరుడు, ధార్మికుడు. మాటను నిలబెట్టు కొనుటకై అంతపరితపించు చున్నాడేకానీ కైకకు లొంగికానీ, కామాతురత వలనకానీ కాదు.

తాను ఆనాడు ఇచ్చిన మాట సత్యము. అంతేకాక నిన్నకూడను, నీ అభీష్ట మేదైననూ సరే నా ప్రాణాపాయమును కలిగించు నదైననూ సరే నేను నెరవేర్తునని, వాగ్దానముచేసెను కాన, దానినివొర్చుకొనుటకు మార్గములేక, నన్ను అడవులకు పంపుటకు యిష్టములేక, పరితపించు చున్న తండ్రిని, కామాంధుడని నేనంగీకరింపను, "లక్ష్మణా! దశరథమహారాజు తనవ్యారికలకంటే ధర్మాత్ముడు; ముల్లోకములలోనూ

అతని పేరు ప్రతిష్ఠలు మ్రోగినవి. ప్రసిద్ధికెక్కినవి. అతను జీవించియుండగా అతని పట్టపురాణి అయిన కౌసల్యాదేవి పతిని విడిచి కొడుకుతో అడవికి వెళ్ళినదన్న వార్త లోకమునకు అపమార్గమును చూపించినట్లగును.

బ్రతుకు కొంతకాలము; ఈ అల్పకాలమునకు శాశ్వతకీర్తిని కోల్పోవుట నాకు కానీ నీకు కానీ మంచిది కాదు, తల్లీ! అని తిరిగి తల్లి వైపున తిరిగి, దీనముగా ప్రార్థించుచున్న రామవాక్యములు కౌసల్యకు కొంత విచారమును కలిగించినది. స్తంభించిపోయినది. రాముడు ఇక నిలువడని గమనించింది. తననూ నిలుపుటకై చేసిన ప్రయత్నములు అన్నియూ విఫలమయినవి. కడకు సమ్మతించక తప్పదని తలంచినది. తాను విలపించుకొలదీ, రాముని బాధపెట్టినటులే కాగలదని భావించినది కౌసల్య.

( సశేషము )



# శ్రీ సత్యసాయికథాసుధ

అమాయకురాలైన ఒక పల్లెపడుచు ప్రతిదినం తాను భక్తివిశ్వాసాలతో కొలిచే ఒక సన్యాసికి నిత్యం ఆవుపాలు తీసుకువచ్చి యిచ్చేడిది.



ఉపదేశం—

విశ్వాసం



నావమీద నదినిదాటి ఆ సన్యాసి ఆశ్రమమునకు రావలసి ఉండుటచేత, నిత్య కర్మానుష్ఠానమునకు నిర్ణీతమైన సమయ మును తరచు అధిగమించుచుండెడిది.

స్వామీ! పడవ అందకపోవుటచే చాలా ఆలస్యమైనది. క్షమింపుడు.

"దైవకార్యముపట్ల అలక్ష్యము మహా పాపము. నీకు నిజ మైన భక్తివిశ్వాసములే ఉంటే ఆ నావ ఎందుకు? భగవన్నా మమును జపిస్తూ నదిపై నడచి రావచ్చు.





అటుపై ఆమె నిర్ణీతసమయమునకే పాలు తెచ్చి ఇచ్చేడిది.

"బిడ్డా! ఇటీవల పాలు సకాలములో ఎట్లు తీసుకొని రాగల్గుచున్నావు?"

"స్వామీ! తమ ఉపదేశానుసారం భగవన్నామస్మరణ చేయుచూ నదిపై నడచి వచ్చుచున్నాను."

మరునాడు స్వయముగా నదీతీరమున నిలచి పరికించెను.

ఆమె క్షీరపాత్ర కరముల ధరించి నామము జపించుచూ నదీ జలముపై నడచి వచ్చుటచూచి చకితుడయ్యెను. వ్యంగ్యముగా తానుచేసిన ఉపదేశముపట్ల ఆమెచూపిన గాఢ విశ్వాసముయొక్క శక్తిని గ్రహించి జ్ఞానోదయుడయ్యెను.

బొమ్మలు:—
టి.వి. సత్యమూర్తి

# సత్య త్రయి

వందే సుందర మందహాస వదనం
కారుణ్య వారాంనిధిం
భారద్వాజ పవిత్ర గోత్ర భువ
మాపస్తంబ సూత్రం ప్రభుం
ఉద్యద్భాను మరీచి మండల రుచిం
ప్రేమ స్వరూపం శివం
శాంతి శ్రీ వలయం ప్రశాంతి నిలయం
"సత్యం" "శివం" "సుందరమ్"॥

* * * * *

కస్తూరీ తిలకం కపోలఫలకే,
మౌళౌ జటా మండలం,
జిహ్వాగ్రే సకలాః, కలాః, కరతలే
భూతిం, కరే కల్పకం
సర్వాంగే అరుణాంశుకంచ, కలయ॒
కంఠే సుధా మాధురీం,
పుణ్యస్త్రీ పరివేష్టితో, విజయతే,
శ్రీ సత్యసాయీ ప్రభుః

పుణ్యోల్లాసిని పుట్టపర్తి నగరే
చిత్రావతీ ప్రాంగణే
మోక్షశ్రీ వలయే ప్రశాంతి నిలయే
సద్భక్త సంఘైస్సహ
"హే స్వామిన్! భగవన్! జగత్త్రయ విభో!
హే సత్యసాయి ప్రభో
మాం పాహి" తివదన్ క్షణానివ దినాన్
నేష్య త్యహో భాగ్యవాన్॥

— కరుణశ్రీ



మానవత్వమును మాధవత్వమునకు మార్చే శక్తి సంపాదనకు జ్ఞానమే ప్రధానసాధన. మాధవత్వంఅనే పదమునకు మాయాధిపతి అని అర్థమున్నది. మా అంటే ప్రకృతి, మాయా. ధవుడంటే, భర్త; అధిపతి. పవిత్రపతికి సతి ప్రకృతి. వేదపురుష సప్తాహజ్ఞాన యజ్ఞమును నవరాత్రముల్లో జరిపించేది ఈ జ్ఞానాభి వృద్ధికొరకే. ప్రకృతిలోని జీవుడు పతిఅయిన మాధవుని చేరటమే దీని అంతరార్థము.

శ్రీవారు

# దసరా దివ్యానందము

ప్రశాంతి నిలయంలో అక్టోబరు ఎనిమిదవ తేదీన ఉదయం 7-30 గంటలకు పతాకావిష్కరణముతో దశరా ఉత్సవము ప్రారంభమైనది.

భగవాన్‌తో ప్రత్యేక సంభాషణ కోరునటువంటి భక్తులు వరుసలు దీర్చి కూర్చొనుటకొరకు నిలయముయొక్క యెదుట భాగమును మరింత విస్తృతపరచి యున్నది.

దర్శనము ప్రసాదించుటకు అందమైన అర్ధచంద్రాకారపు పోర్చితోనూ, పైన, మహత్తరమైన మూడు తళతళ మెరిసిపోయే బంగారు కలశములుగల శిఖరములతోనూ తీర్చి దిద్దటమై ఈయుగావతార నిలయమైన భవనమై, ప్రపంచ ప్రజలందరికీ పవిత్రమైన నిలయము విలసిల్లుతూ వున్నది.

భగవాన్ పతాకావిష్కరణ గావించు సందర్భములో డాక్టర్ గోకాక్‌గారు మాట్లాడుతూ "పునరుజ్జీవనమునకూ పునర్నిర్మాణమునకూ మానవుల ఐక్యతకూ పరిపూర్ణతకూ యీపతాకము స్ఫూర్తిదాయకమైన చిహ్నం" అన్నారు.

భగవాన్ మాట్లాడుచూ "ఈసమస్త లోకములకూ సూర్యునియొక్క దివ్యతేజస్సునకూ యీఅఖండ విశ్వపు దేశ కాలము

లకూ ప్రతిహృదయమునకూ ఆధారమైన విష్ణువుగాను సాయి కృష్ణునిగానూ నెలకొనియున్నది ఈనేనే" సంటూ డక్కుటు మార్కో గేలా ఉద్ఘాటిస్తూ "యీదశరాత్రో ప్రశాంతి నిలయపు మమగడలో ఒక నూతనాధ్యాయము ప్రారంభమైనది, యిక్కడున్న ప్రతివారు తమలో అంతర్గర్భితమైయున్న దైవత్వమును తీవ్రసాధనద్వారా దర్శించుటకు యుక్తమైన సాధనలకు అనుకూలమైన నిశ్శబ్దమైన పరిసరములతో ప్రశాంత వాతావరణమును కల్పించుటకు నిశ్చయము జరిగినది" అని సెలవిచ్చారు.

మంగళవాయిద్యములతో పండితుల వేదఘోషతో భగవాన్ నూతన భవనముల వైపువెళ్ళి సుమారు 70 ఇండ్లకు ప్రవేశోత్సవము గావించిరి. నివాసావకాశము అనుగ్రహింపబడిన భక్తులకు అమితానందమును కలుగజేసిరి. వారందరూ ఎవరికివారు తామే యింత గొప్ప అనుగ్రహముతో గూడిన ఆనందమునకు మొదటి వారమనుకొనిరి. భగవాన్ ఒక్కరు మాత్రమే ప్రసాదించగల ఒక ఆనందోత్సవము యిది.

ఆ సందర్భమును గురించి ఒకభక్తుడీ విధముగా వ్రాసెను 'ద్వారమునకు కట్టిన రిబ్బను కత్తిరించుటకు కత్తెరను మాతండ్రి భగవాన్‌నకు అందించునపుడు భగవాన్ మావైపుచూచి నవ్వెను మా ఆనందమునకు అంతులేదు. బాబా లోనికి ప్రవేశించి పూజా వేదిక కెదురుగా చేతులు వెనుకకుమడుచుకొని కొన్ని క్షణాలునిలిచి అక్కడవున్న ఒక మడత యినపకుర్చీపై మందహాసముతో ఆశీనులైరి. అతుప్పు పట్టిన యినపకుర్చీపై కూర్చొనుటకు వారు

ఎంతమాత్రమూ సందేహించలేదు ఆతరువాత పాదనమస్కా రముల ననుగ్రహించి ఆశీర్వాదముల ప్రసాదించిరి. నా కెంతో శాంతి సౌఖ్యములు సమకూరినవి.

ప్రసాదపు ప్లేటులోని ఒక చిన్న టాఫీని మాత్రము తీసికొని అక్కడున్న నీటిగ్లాసును పెదవులతో స్పృశించిరి. (వారువెళ్ళిన తరువాత మేము ఆ నీటిని భగవాన్ ప్రసాద ముగా తీసికొనగా, మీరు నమ్మండి! నిజంగా అది అమృతో పమానంగా, మధురాతి మధురంగా మారిపోయింది.) ఆ తరు వాత వారు మమ్ములను హారతి వెలిగించి పాటపాడమనిరి. అది మాకు ప్రత్యేకంగా ప్రసాదించిన ఆనందముగా భావించాము. ఎంతో కదలించేదిగా ఎంతో ప్రేమతో. ఎంతగానో హృద యాన్ని తేలిక పరచేవిగా ఆ మాటలు, ఆ చూపులు, వారు మాగదిలో వున్నంతసేపు మాత్రమేగాక మమ్ములను నిత్యము ఆలరిస్తూనే యున్నవి. నా ఆలోచనలన్నియూ వారితో నిండి నామనస్సు ఎంతో సుఖశాంతులతో ప్రశాంతమై ప్రేమతో కూడి న ఆనంద బాష్పములతో నా కన్నులు నిండిపోయినవి. యిక నేను వ్రాయలేను.''

ప్రతివాకిటి ముందు వారి ప్రాంతీయ సంప్రదాయ సిద్ధమైన ఆచార వ్యవహారముతో భగవాన్ బాబావారిని ఆహ్వానిస్తూ ఒక గొప్ప ఉత్సవ వాతావరణాన్ని సృష్టించి ప్రతి ఒక్కరు ఆనం దించిరి. ఉదాహరణకు. కలకత్తా భక్తులు శ్రీవారిని ఆహ్వా నిస్తూ వారి సాంప్రదాయాన్ని అనుసరించి శంఖపూరణాది మం

గళధ్వనులను గావించిరి అట్లే దేశములోని ప్రతిఒక్క ప్రాంతము వారు వారివారి ఆచార సాంప్రదాయములను అనుసరించిరి.

మధ్యాహ్నము పదివేల మంది పేదప్రజలకు అన్నదానము జరిగినది, గడచిన ప్రతి సంవత్సరము వలెనే యీసంవత్సరముకూడ ప్రేమతో వికలాంగులకు, దీనులకు, వృద్ధులకు పంచెలు, చీరలు—పురుషులకు వృద్ధయింజనీరు భావరాజు సత్యనారాయణగారిద్వారా, స్త్రీలకు శిరోహి రాజమాతగారిద్వారా అందజేసి వేలకొలది ప్రజలను ఆనందపరచిరి. సాయంకాలము శ్రీ సత్యసాయి హాస్పిటల్ వార్షికోత్సవము భగవాన్ సమక్షముతో డా॥నల్లైనాథన్‌గారు (కొలంబో, శ్రీలంక) అధ్యక్షతను జరుపబడెను. డా॥జయలక్ష్మి వార్షికనివేదిక సమర్పించెను డా॥ నల్లైనాథన్ పంచకోశములను గురించి, శరీరత్రియమును గురించియూ మాట్లాడుతూ శారీరిక, మానసికవ్యాధులను నివారించుటలో ధ్యానము యొక్కయూ, యోగముయొక్కయూ ప్రాముఖ్యతనుగురించి వివరించెను. తరువాత శ్రీవారు మాట్లాడుచూ యుక్తాహార, విహారములను గురించియూ, ఆత్మసందర్శనమునకు ఆరోగ్యముయొక్క ప్రాముఖ్యతగురించియూ ప్రబోధించిరి.

అక్టోబరు 9 వ తేదీ ఉదయము శ్రీ సత్యసాయీ సేవాదళ రెండవ అఖిలభారత వార్షికోత్సవ సమావేశము శ్రీవారి అధ్వర్యమున జరుపబడెను. హిందూదేశముయొక్క అన్ని రాష్ట్రములనుండియూ — బహుదూర ప్రాంతములైన కొహి

మానుండి కొయినావరకు, డెహ్రాడూన్‌నుండి దిండిగల్ వరకుగల పట్టణములనుండి మూడువేల మందికి పైగా సభ్యు లు యీ సమావేశములో పాల్గొనిరి. వారిలో చాలమంది ముందుగానే ప్రశాంతినిలయము చేరుకొని అడ్డుగానున్న చెట్లను పడగొట్టుటలోను ఇటుకలు ఇసుక మట్టిని అవసరప్రాంత ములకు చేర్చుటలోను, పాతకట్టడములను పడగొట్టి, క్రొత్తభవన ములు నిర్మించుటలోను; పరిసరములు శుభ్రపరచుటలోను ఆనందో త్సాహములతో పాల్గొనిరి.

సాయిసంస్థల రాష్ట్రఅధ్యక్షులు, జిల్లాఅధ్యక్షులు; మరియు పునర్‌నిర్మాణ కార్యక్రమములలో ఆసక్తిగల మరికొందరును భగవాన్ మార్గదర్శకత్వముతో జరుగుచున్న యీ సమా వేశంలో పాల్గొనిరి. యీ సమావేశమునకు శ్రీ నకుల్‌సేన్ (గోవాగవర్నరు) అధ్యక్షత వహిస్తూ "ప్రతి సభ్యుడు సాయి సందేశమును హృదయానికి హత్తించుకొన వలెనంటూ గీత రెండవ అధ్యాయము, పదకొండునుండి పదిహేనువరకు, మరియూ నలభైఅయిదు నుండి నలభైఎని మిదివరకు శ్లోకములను వాటియొక్క అనుభవ పూర్వకములైన సందేశములను వివరించిరి.

డా॥ వి., కెగోకాక్‌గారు తమక్రొత్త పుస్తకమును — వర హరి ప్రొఫెట్ ఆఫ్ న్యూఇండియా ఆశ్రమ జీవితానికి సంబం ధించిన ఒక నవల, బాబావారి ప్రత్యేక విభూతులతో అల్లబ డిన కథతోకూడిన నవలను బాబావారి పాదపద్మములకు సమ

ర్పించిరి, "యిదిమీయొక్క సువాసనాభరితమైన చిన్న మల్లెపూవు" అనిరి.

సమావేశకర్త డా॥కె.కె.మిస్త్రీ (1)సేవాదళ సభ్యునకు నిర్వచనము; వాలింటీరునకు సేవాదళ సభ్యునకుగల తేడాలు (2) సేవా దళముల సమస్యలు (3)వాటి కార్యక్షేత్రము యొక్క పరిమితి (4)ఒకే విధమైన దుస్తులు మెడగుడ్డ: బాడ్జి; గురించి నిర్ణయించి తగు సిఫారసులుచేయుటకు నాలుగు కమిటీలను ఏర్పరచెనని ప్రకటించెను. తరువాత శ్రీవారు దివ్యబోధ నందించుచూ. "రామకృష్ణపరమహంస ధ్యాననిమగ్నుడై యున్న సమయమున. ఆయన యెదుట దేవిప్రత్యక్షమై. తేజోవంతుడైన ఒక అబ్బాయిని ఆయనకు చూపించి, "ఇతడు నీకుమారుడు" అని పలికినది. రామకృష్ణుడు దిగ్భ్రాంతితో, స్త్రీలు అందరినీ మాతృ సమానముగా భావించుచున్న నా కిదేమి విపరీతమని చాల బాధపడి నాడు. ధ్యానావస్థలో నే కంటిధారలుకారినవి. "తల్లీ! యేమిటీ ఘోరము! నాయందు నీవేకలవు; నీయందునూ నేనే కలను! ఈశావాస్యమిదం సర్వం, ఈశ్వరస్సర్వ భూతానాం అని తెలిపి కొన్న నాకు భార్యాపుత్రులెవ్వరు? బంధుమిత్రులెవ్వరు" ?అని పరితపించినాడు అప్పుడు దేవి మృదుమందహాస వదనురాలై కామపుత్రుడు కాదు ప్రేమపుత్రుడు, అని సమాధానపరచినది.

కొన్నిసంవత్సరాల తరువాత. రాఖాల్ అనేఒక అబ్బాయిని మనమోహన్ అనేవాడు దక్షిణేశ్వరమునకు తీసుకొని వచ్చినపుడు. పరమహంసునికి ధ్యానదృశ్యము జ్ఞాపకమయి. ఆపిల్లవాణ్ణి కౌగిలించుకొని, ఆనందబాష్పములతో స్వాగతించి తనదగ్గరనే నివా

నమేర్పరచినాడు. వాడే రామకృష్ణుని ప్రేమపుత్రుడు, బ్రహ్మా నందుడు; రామకృష్ణమఠముయొక్క మొదటి అధ్యక్షుడు. రామకృష్ణుడు తన అంత్యనిమిషమునకు 8 నిమిషముల ముందుగ బ్రహ్మానందుణ్ణి తన సమీపమునకు పిలచి, ఆయన చెవిలో తన ధ్యానానుభవమును చెప్పినాడు. నాయొక్క సమస్తసొత్తుకు నాపుత్రునకే అధికారమని అన్నాడు.

ఈ కథను నీకు చెప్పే కారణమేమనగా: రామకృష్ణునికి ఒకడు ప్రేమపుత్రుడు, ఆబ్రహ్మానందుడు; నాకు మీరందరూ ప్రేమపుత్రులు;''

''అయితే, ప్రేమపుత్రులుఅనే పదవికి మీరందరూ అర్హులు కావలెను, ప్రేమతత్వమును హృదయము నందభివృద్ధిచేసుకోవలెను'' అని బోధించిరి. తరువాత, 10వతేదీ సాయంత్రము నియమిత సమితుల సలహాలను (సేవాదళసభ్యులందరూ రాష్ట్రవారిగా చేరి పరిశీలించిన తరువాత) సర్వసభ్యుల సమావేశములో చదువటము జరిగినది. వాటినిగురించి తమ అభిమతములను తెలుపుచూ శ్రీవారు ఆశీర్వాదపూర్వమైన దివ్యోపన్యాసము నొసంగిరి.

''సేవలద్వారా మీలోని ఆత్మతత్వమును అర్థము చేసుకోవలెను. ఇదే సత్యసాయి సేవాదళముయొక్క స్థాపనకు ముఖ్య ఉద్దేశము. నిన్న నియమించిన సబ్‌కమిటీలు ఎన్నో సలహాల నందించినారేకాని వాటిని ఆచరణలో పెట్టుటకు మీరు సంసిద్ధులై యున్నారా అనేది పెద్ద ప్రశ్న. మానవుడు సాకారమైన సత్య స్వరూపుడు. సమాజమనేదికూడ దైవాంశ సంభూతులైన మానవ

సమూహమే; అది అహంకార ప్రేరిత సమూహముకాదు. జీవితము భోగనిమిత్తము రాలేదు; సేవనిమిత్తమై వచ్చినదే; సమాజ సేవనిమిత్తమై. విరాట్‌స్వరూపమైన సమాజముయొక్క సేవనిమిత్తమై; ప్రకృతిలోవించి ఆత్మలోనికి ప్రవేశించి ప్రకాశింపజేసేదే సాయి బోధ. మీస్వస్థానము ఆత్మస్థానమే. నిశ్చల నిర్మల నిస్వార్థమే మీ నిజస్వరూపము. సేవవలన లభించే ప్రేమాభివృద్ధి, అహంకార నాశనము, ఆనంద జ్యోతి. వీటిని అనుభవమునకు తెచ్చుకొనుటయే సేవాదళ సభ్యుల ముఖ్య కర్తవ్యము.

సేవాదళ సభ్యుల అర్హతలు యేమిటి అనే ప్రశ్న వచ్చినది. సత్యసాయి పైన సంపూర్ణవిశ్వాసము కలిగినవాళ్లె దళములో చేరి కార్యక్రమములలో పాల్గొనుటకు అర్హులు. సత్యసాయిబోధనలపై భక్తిశ్రద్ధలులేక, సత్యసాయి సేవాదళమువారు అని యెట్ల చెప్పుకొనేది? ఆ విశ్వాసమును దృఢము చేసుకొని, తరువాత దళములోచేరి, దానియొక్క ఆశయాలను అలక్ష్యముచేయక, వాటికి విరుద్ధముగా వర్తించక, శక్తిసామర్థ్యములన్నిటినీ వంచన లేక సేవాకార్యములలో వినియోగించండి. మీకు రూప నామములున్నవి కానీ సత్యసాయి ప్రబోధనకు రూపనామములు లేవు, కాబట్టి, కులము మతము వ్యక్తి అనేభేదాలను గమనించక, అందరూ, ఆ ఆశయాలకు తగిన జీవితమునకు పూనుకొండి.

ఇంక, దళముయొక్క కార్యకర్తలకు కొన్ని నిబంధనలు; వీళ్ళకు గ్రామములకు వెళ్లి అక్కడ సాయి బోధనలను గురించి ప్రసంగించే శక్తి సామర్థ్యములు కూడ ఉండవలెను.

భారతీయ వాంగ్మయములోని రామాయణ భారత భాగవత ములనే దివ్యదీపికలను అందరు చక్కగా పఠించవలేను. విద్యార్థులు పెద్దవయస్సు వాళ్లుకూడ పిచ్చి పిచ్చి కథలను చదువుదురే కానీ ఈ పవిత్రగ్రంథములను చదువుటకు పూనుకోవటములేదు. పరోపకారఃపుణ్యాయ, పాపాయ పరపీడనం; పరోపకారార్థ మిదం శరీరం — అనేసూక్తులను సోదాహరణముగా ఈ గ్రంథములం దించును. ఈ మూడుగ్రంథముల చక్కని పరిచయములేక భారతీయసంస్కృతి ఎవ్వరికీ అర్థముకాదు. సభ్యులందరూ ఆ సంస్కృతిని తెలుసుకొని ఆచరించి ఆనందించవలెను. కాన, వాళ్లకు ఈ గ్రంథముల పఠన అత్యవసరము

కన్వీనర్లు, లీడర్లు కాబట్టి, వారినడకలు వారిపలుకులు అతిపవిత్రముగా వుండవలెను, ఇతరులనుసరించె కొరకు వారే ఆదర్శములనందించవలెను, కదా? కొన్నిప్రాంతములందు కన్వీనర్లు లీడర్లుకాక, ప్లీడర్లుగా, వాగ్వాదములో సమర్థులవుతున్నారు. కన్వీనర్లు చేసి చెప్పువారుగావుండాలి కాని చెప్పి చేయించువారు కాకూడదు; ఇప్పుడు ప్రపంచమే ఆధోరణిలో పోవుచున్నది. అన్నిక్షేత్రములలోనూ అంతే. ఇట్టివారలకు సత్యసాయిసంస్థలో యేమాత్రమూ స్థానములేదు. దీనిలోచేరి నేను పనిచేయలేను. అనిన అదిఒక్క మహాపాపమే ! అట్లకాక మార్గదర్శకులుగా ఉత్సాహముతో భక్తిప్రపత్తులతో మీరు సేవసలుపిన తప్పక నేను చూచుకో గలను; స్వామి అనుగ్రహము సంపూర్ణముగా వుండును.

ఇక, సేవాదళ సభ్యుల వయఃప్రమాణము. సేవ సలుపుటకు ఈ రీతి హద్దులెందుకుండవలెనని సందేహము కలిగేది

సహజమే. వాలంటీర్లకు వయఃపరిమితి నిర్ణయించనక్కరలేదు. వాళ్లు తమ శక్త్యానుసారము అవకాశము దొరికినప్పుడు సేవ చేయవచ్చును. అయితే, సేవాదళమునకు నియమనిబంధనలు అత్యవసరము. ఇపుడు పురుషులవయస్సు 18 -35 సం॥ అనియూ స్త్రీల వయస్సు 18-40 సం॥ అనియూ నిర్ణీతమైయున్నది. ఇది సరైనదే. క్రమశిక్షణమున శ్రద్ధ, ఉత్సాహము మొదలైనవి వృద్ధులలో నిరీక్షించుట కవకాశముండదు. సభ్యులందరూ సమవయస్కులైనచో వారికి సేవాకార్యములలో మరింతవుత్సాహమబ్బును. సమవయస్కులు మందలించిన, దానిని, యెక్కువ అవమానముగా భావించి, సభ్యులు దిద్దికొంటారు. కూడా. 18 వయస్సుగల యువకుణ్ణి 60 సం॥ వయస్సుగల వ్యక్తి మందలించిన, దానిని వాడు ప్రమాణముగా స్వీకరించక, అలక్ష్యము చేసే సంభవమున్నది. కాలమార్పు విషయము మీకేమి తెలియును. మీరంతా పాత కాలమువాళ్లని వాడు ఆ వృద్ధుని తిరస్కరించవచ్చును. కాబట్టి 40 సంవత్సరం వయస్సయిన తరువాత, తమశక్తికొద్ది తాము వాలంటీర్లగా సేవ సలుపేది మంచిది.

రాముడు నరాకారమును ధరించినవ్యక్తి; సుగ్రీవుడు వానరాకారమును ధరించినవ్యక్తి; అయిననూ వారిరువురికీ అవస్థా సన్నిహితమువలన, వయస్సన్నిహితము వలన, బాధాసన్నిహితము వలన గాఢమైన స్నేహము తటస్థించినది. ఇద్దరికీ సోదరనిమిత్తము అరణ్యవాసము సంభవించినది; ఇద్దరూ రాజ్యభ్రష్టులు; ఇద్దరికీ భార్యా వియోగము;

దీనిని బట్టి చూచిన, సమవయస్కులు యువకులు బుద్ధి బలము గలవారు సేవాదళ సభ్యులుగా వుండుటయే మంచిది అని తేలును. మనోబలము దేహబలము ఉత్సాహబలము అన్నీ పూర్తిగా సేవాకార్యములలో వినియోగించు యువకులు గ్రామసీమలలో కార్యనిరతులైనచో పల్లెలవారుకూడ సేవలో పాల్గొనుటకు పూను కొందురు.

మరొక విషయము సేవాదళము యువకుల మేలుకొరకే స్థాపితమైనది. ఇపుడు భారతీయ సంస్కృతి యేమిటో తెలియక ఆధ్యాత్మిక మార్గములో కాలుపెట్టక, యోగము, ధ్యానము, జపము అసలేపట్టక, యువకులు అశాంతికి గురియగుచున్నారు. పెద్దలంటే విశ్వాసము లేదు, పాపభీతి లేదు. దైవప్రీతి లేదు. వారు ఒక సత్యసాయి ప్రేమకు మాత్రమే కట్టుపడ్డారు కానీ మరొకరి మాటలు వినే స్వభావములో లేరు. అదికూడ యేకారణము వలన అనిన సత్యసాయి ఎల్లప్పుడూ తానుచేసి మరొకరికి చెపుతారు; అపని ఈపని అని లేకుండా అన్నిటిలోనూ చేరుకుంటారు. వాకూ. వారికీ సంబంధించిన ప్రేమ సూత్రము అది

ఇక, కొన్ని మార్పులనుకూడ మన నిబంధనలలో చేయ తలంచుచున్నాము. ఇంతవరకు ఒకలక్ష జనాభా కలిగిన పట్టణము లలో మాత్రమే సేవాదళములను స్థాపించుటకు సమ్మతించినాము. ఇకపై ప్రతిపల్లెలలోనూ సేవాదళములను స్థాపించవచ్చు. దానికి యేమాత్రమూ అభ్యంతరము లేదు,

పల్లెలయందే ఇపుడు జీవితము యెక్కువ బాధగావుం దేది. అక్కడి అశక్తులకూ రోగులకూ అమాయకులకూ పలు రీతుల సహాయము ఇపుడు అత్యవసరము. పట్టణములలో వీటికి యెన్నోసంస్థలున్నాయి; పల్లెలలోనే తక్కువ, ఆహార విహారాదుల మార్పులవలన అనారోగ్యము తీవ్రమై బాధపడేవాళ్లను, అశాంతిలోపడి అల్లాడేవాళ్లను, ఆధ్యాత్మికమార్గములో ప్రవేశింపజేసే అవకాశమున్నది. నామసంకీర్తనతో భజనలతో అపవిత్రవాతావరణమును శుభ్రపరచవలెను. సేవాదళములోని డాక్టర్లూ లాయర్లూ పల్లెలవారి సమస్యలను పరిహరింప పూనుకోవలయును. వారికి తగుసలహానిచ్చి, సహాయపడవలెను. ఆధ్యాత్మిక కథలనుతెలిపి, వారిహృదయములలో సోదరభావమును, ప్రేమతత్వమును నాటవలెను.

జిల్లాకొక కన్వీనరు, రాష్ట్రమునకొక కన్వీనరు, వీరిని సేవాదళముయొక్క స్థాపన పోషణ శిక్షణ కార్యముల అభివృద్ధి కొరకు నియమించవలెనని నా సంకల్పము.

ఇక,యూనిఫారం డ్రెస్సు విషయం; మీ డ్రెస్సు వికారముగా విచిత్రముగావుంటే, మిమ్ములను యెవరూ సహాయమడుగరు, సమీపించరు. నవనవీనఫ్యాషన్లరీత్యా ఆడవాళ్లు మగవాళ్లు రకరకాల ఆడంబరఅలంకారములు చేసుకొంటూ తిరిగితే సామాన్యజనులు వారినుంచి దూరముగనే వుంటారు. దేహరక్షణ మీగౌరవరక్షణ, రెండునూ మీరు మీడ్రెస్సువలన నిర్వహించుకోవలెను, అంతే.

యూనిఫారం అది మీ డ్రెస్సుకు నేనేమాత్రము విలువనీయను అయితే, మీ మీ హృదయమునకు ప్రేమవస్త్రము ధరించండి; మీ మీ కంటికి సమదృష్టిని తగిలించండి. అదే నాకు కావలసిన మీ యూనిఫారం! నాకు సంబంధించినవరకూ అంతే చాలు! అయితే, జిల్లా సమ్మేళనములూ, స్టేట్ సమ్మేళనములూ, అఖిలభారత సమ్మేళనములూ జరుగుసమయమున, యూనిఫారం ఒకటిని ధరించవలసియున్నది. తెల్లటి వస్త్రములే, నిర్మల నిస్వార్థ మనో భావముయొక్క చిహ్నములు. నక్కలు కుక్కలు మొదలైన వికార చిత్రములులేని, ఫుల్ఆర్మ్ షర్టులు; డ్రైనేజి పైపులవలె వద్దు, సరైన ప్యాంట్లు, వీటిని ధరించండి.

ఇక, వాలంటీర్లకూ సేవాదళ సభ్యులకూ గల భేదమేమి అనే ప్రశ్న వచ్చినది. సేవాదళ సభ్యులు యెల్లవేళల యెక్కడ నుండి నమూ సేవకు సిద్ధముగా నుండవలెను. వారికి ప్రత్యేక ఆధ్యాత్మిక శిక్షణకూడ విధింపబడినది. వారు అనేక రీతుల సేవాకార్యములకై సుశిక్షితులుగా సదా సంసిద్ధులైయుంటారు. అయితే వాలంటీర్లు, సమావేశములందు మాత్రము వారి వారి శక్తికొలది వారి వారి కర్తవ్యకర్మలనాచరింతురు. వారికి శిక్షణతో కానీ నిబంధనలతో కానీ అంత పనియుండదు.

మరొక ముఖ్యమైన విషయము: సేవా మనోభావము మీ మీ ఇండ్లలోనే మొట్టమొదట కార్యగతము కావాలి. మీ మీ తల్లి తండ్రుల సేవ చేయక, బయట మీరేమి చేసినమా స్వామి

అనుగ్రహించరు. వారు అనారోగ్యముతో బాధపడుచుండగా, వారిశుశ్రూషను అలక్ష్యముజేసి, మీరు బయట యెంత మందికి ఉపకారముజేసిననూ, అదంతా అపకారమే అగును. వారిని గౌర వించి, వారిని ప్రసన్నులుగావించితే, తప్పక స్వామి అనుగ్రహము మీవెంట జంటవుండి కంటిరెప్పవలె మిమ్ములను కాపాడును. మీ జీవితములను పవిత్రముగావించే ప్రయత్నమును, సార్థకము చేసికొనే సాధనలను, ఇంటిలో ప్రారంభించండి తరువాత, బయటకు వెళ్ళటానికి పూనుకొండి.

కాలమును వ్యర్థముచేయక, కాయమును దుర్వినియోగ పరచక, కర్మాచరణయందు కాలుపెట్టండి. అహంకారమునకూ అవిశ్వాసమునకూ అవినీతికీ చోటివ్వక, ఆడంబర జీవితమునాశించక, అన్యోన్య భావమునభివృద్ధి చేసుకొని, మీ ఆత్మోద్ధారమునూ దేశోన్నతినీ లోకకల్యాణమునూ సాధించండి." అని ఉద్బోధించి ఆశీర్వదించిరి.

తరువాత, శ్రీవారే సేవాదళసభ్యులందరికీ మధురోపహారమునూ వస్త్రదానమునూ పంచిపెట్టి అందరికీ అమితానందము నందించిరి.

12 వ తేదీన, గురువారము, ఉదయము 10 గంటలకు వేద పురుష సప్తాహ జ్ఞానయజ్ఞముయొక్క ప్రారంభోత్సవము మహా వైభవముగా జరిగినది. ఈ శరన్నవరాత్రికి సరిగ్గా దానికి వినూతన విశాల విశిష్ట వేదికనూ సభామండపమూ సిద్ధమై యజ్ఞ సమారంభము మరింత విరాజమానముగా శోభించినది. ప్రతి

దినమూ ఐదు అగ్నిగుండములలో మొత్తం 14 ఋత్విక్కులు వేదమంత్రోచ్చారణతో హోమముచేసిరి. సప్తాహముయొక్క ఏడురోజులు మొత్తం 2, 26, 270 నమక స్వాహాకారాలు జరిగినవి. యాగరక్షకులైన దేవతలకు 5 అగ్నిగుండములలో హోమములనేర్పరచిరి. సహస్రలింగపూజ, సూర్యనమస్కార ములు దుర్గాపూజ, రామాయణ, దేవీభాగవతసప్తశతీపారాయణ ములు మొదలైనవికూడ మహాపండితులచే జరుపబడినవి.

శ్రీవారు యజ్ఞవేదికకు. మైసూరు రాష్ట్రపురాజ్యపాల శ్రీ మోహన్‌లాల్ సుఖాడియాగారితో. ప్రశాంతిమందిరమునుంచి విజయము చేసిరి. సర్వాలంకారభూషిత గజరాజ్ఞి సాయిగీత ముందు నడువగ నాదస్వరగానము, బెంగుళూరు శ్రీసత్యసాయికాలేజి విద్యార్థుల బ్యాండ్‌చే భజనగీతలు, వేదవిద్వాంసులు ఋత్వి క్కులు శ్రీ సత్యసాయి వేదశాస్త్రపాఠశాలవిద్యార్థులు వీరు భక్త్యా వేశముతో పఠించు వేదఘోషము, ఇవి మిన్నుముట్టగా, దేశవిదేశాల భక్తసమూహముయొక్క హృదయాంతరాళమునుంచి వెలువడిన జై జై కారము పర్వతచక్రమునుంచి ప్రతిధ్వనింపగా, భగవానులవారు, మందహాససుమములను నలుదిశలలో కురిపిం చుచూ, అందరికన్నుల కరువు తీర్చుచూ, పూలబాటపై నడచి సభామండపము చేరి, యజ్ఞవేదికపై దర్శనమునను గ్రహించిరి.

శ్రీ మోహన్‌లాల్ సుఖాడియాగారు నూతన మండపము యొక్క ప్రవేశోత్సవసమారంభమున అధ్యక్షతవహించి, భార తదేశమునందు దేశవిదేశాలలోకూడ బాబావారి ప్రభావము జగద్

వ్యాప్తమై వారు లోకకల్యాణమును సాధించుటకు పూనుకొంటున్నా రనేది మీకందరికీ తెలిసిన విషయమే. విజ్ఞానములోనూ సుఖ సంపద్భరితమైన జీవిత పథములోనూ, అభివృద్ధి పొందియున్న అనేక రాష్ట్రముల ప్రజలు శ్రద్ధాభక్తులతో శ్రీవారి సన్నిధికి వచ్చుచున్నారు. వారి ఆధ్యాత్మికతృష్ణను శ్రీవారు ఉపశాంతినను గ్రహించి వారిని తరింపజేయుచున్నారు" అనిరి.

"భారతీయసంస్కృతియొక్క సనాతనరూపమును నూతన పరిస్థితికి అన్వయింపజేసి, దానిపై మానవజాతికి ఇతోధికమైన శ్రద్ధను కలుగ జేసే సంకల్పమువారిది. ఈ సంకల్పముతోనే వారు, వేదోక్త నియమనిబంధనలను తూచాతప్పక, ఈ వేదపురుష సప్తాహ యజ్ఞమును జరుపించుచున్నారు. వేదజన్యమైన సనాతన ధర్మముయొక్క పునరుద్ధరణకు ఈ యజ్ఞము దోహదము నందించును. మహామహిమాత్ములైన శ్రీవారే ఈ వేదవిహిత యాగకార్యమును ప్రోత్సహించుచున్నారు; కాబట్టి, దీనివిశిష్టిత దీనిఫలితములనుగురించి సందేహించనక్కరలేదు. శాస్త్రరీత్యా జరిగే యజ్ఞమునకు దీనికన్న పవిత్రమైన ఫలదాయకమైన ఆధ్వర్యము దొరకదనిమాత్రం నేను నొక్కి చెపుతున్నాను" అని శ్రీ సుఖాడియాగారు శెలవిచ్చిరి.

శ్రీవారు తమ దివ్యోపన్యాసము నందించుచూ, మహా భారత గ్రంథమునకు 'జయ' అని పేరున్నది. జయ అనేపదమును త్రిప్పిన యజ అవుతుంది. యజ అనగా యజ్ఞముచేయి అని అర్థము. మహా భారతము ఒకమహా యజ్ఞము: భారతభూమికూడ

సర్వలోక శ్రేయోదాయకమైన ఒకయజ్ఞవేదిక'' అని ఉద్ఘోషించి, వేలాదిప్రజల కమితానందము ననుగ్రహించిరి. మతములు కలహమునకు కల్లోలములకు కారణములుకావు. మతమునకు సత్యము సహనము త్యాగము ఇవి ప్రాణములు. మానవాభ్యుదయము మతమువల్లనే చేకూరును. మనదేశములో మతములెన్నైనా బోధన మాత్రము ఒక్కటే. అదేచిత్తశుద్ధి; వాంఛలవిసరన; మనోనిగ్రహము; పవిత్రత, తాను సమార్జించిన దివ్యగుణములచే, పరిశుద్ధజ్యోతిచే, నరుడు నారాయణుడవుతాడు; అవసరమువచ్చినప్పుడు, ఆయావేళల, నారాయణుడు నరుడుగా రావచ్చును. నరుడు సాకారుడు, నారాయణుడు నిరాకారుడు; యేకో దేవ స్సర్వ భూతాంతరాత్మా! ఇదే, అన్నిమతములబోధ అన్నారు.

'సర్వవ్యాపకుడుగావున్న ఆనిరాకారుణ్ణి సాకారుడుగాచూడ వీలగునా అనవచ్చు! కొన్ని కార్యాచరణములవలన, కొన్నిసాధనలవలన, అవ్యక్తుణ్ణి వ్యక్తీకరింప జేసుకొనేశక్తిని సంపాదించుకొనుటకు సాధ్యమగును. అగ్గిపెట్టె జోబులో వుంటుంది, ఆపెట్టెలోని పుల్లలలో నిప్పు అంతర్ధానముగా ప్రజ్వరిల్లుతుంటుంది కానీ జోబును కాల్చదు! కానీ, ఆపుల్లనుతీసి ఆపెట్టెకుగీచిన (Strike–Rub–చేసిన) నిరాకారనిప్పుసాకారమై సర్వలోకాలైనా కాలుస్తుంది, రెండు అవ్యక్తశక్తుల జోడుజేసినపుడు, అదిప్రకటమై ప్రకాశమై ప్రత్యక్షమగును. మానవత్వమనే పుల్లను దైవత్వమనే పెట్టెతో అంటించిన, దివ్యజ్ఞానమనే శక్తిప్రజ్వరిల్లి, జ్ఞానజ్యోతివలన, ప్రపంచమనే మాయాంధకారమే నాశమగును అని బోధించిరి,

మానవహృదయమే యజ్ఞకుండము; మనోవాంఛలే అగ్నిజ్వాలలు: దుర్గుణములే ఆకుండమందర్పితముచేయు పదార్థములు; ఆనందమే, యజ్ఞముయొక్క ఫలితము.

ఇది సంవత్సరమున కొకపర్యాయము, శరన్నవరాత్రిలో పుటపర్తిలో జరిగేదికాదు; ఇది మీ మీ నిత్యయజ్ఞము; సదాసర్వత్ర మీరు జరుపవలసిన యజ్ఞము "అని హెచ్చరించిరి. యేదిచేసినా, యేదిపలికినా యేదితలంచినా భగవదర్పితముగా భావించాలి అదే నిత్యయజ్ఞముయొక్క నిజతత్వము అని తెలిపిరి.

సాయంత్రం 4-30 గం॥కు అఖిలభారత ప్రశాంతివిద్వాన్ మహాసభయొక్క వార్షిక మహాసభ భగవానుల దివ్యసన్నిధియందు సమావేశమయినది. బ్రహ్మశ్రీ గండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వేదపురుష యజ్ఞముయొక్క పరమోద్దేశము, సమస్త మానవులలో అంతర్యామియై ప్రకాశించుచున్న జ్ఞానస్వరూపుడైన పరమాత్మని అనుగ్రహప్రాప్తి, అని ప్రబోధించిరి. స్వస్వరూప జ్ఞానసంపాదనే దాని ఫలితమని విశదీకరించిరి. సర్వదేవతాస్వరూపులైన శ్రీ సత్యసాయి పరమేశ్వరుడు "దివ్యాత్మస్వరూపులారా" అని మానవకోటిని సంబోధించటము, సర్వజీవులూ తమ స్వరూపులు అని విరాట్‌స్వరూపమును వెల్లడించుకొరకే అని స్పష్టపరచిరి.

శ్రీవారు తమ దివ్యోపన్యాసమునందు వేదవాంగ్మయమును గురించి, సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్తులు. మొదలైన విభాగములనుగురించి చక్కగా వివరణలనందించిరి. శబ్దబ్రహ్మ

మునకు సప్తస్వరములు ఉపాధి; దానివలన. సప్తాహయజ్ఞము విశిష్ట మైనది. అన్నారు. మానవుని శిరస్సులో సప్తప్రాణములు జీవిత తత్వమును కాపాడును; అవి. రెండు కన్నులు. రెండు చెవులు. రెండు నాసికాద్వారములు ఒక నోరు ఇవి అరక్షకులు. బ్రాహ్మణస్య ముఖమాసీత్. అని అన్నిటికీ సారమైన జ్ఞానమునకు సప్త ప్రాణములతో చేరిన ముఖమే ఆధారము. కాబట్టి, సప్తాహమునకు ప్రాధాన్యత యేర్పడినది. అనిరి.

వేదమున, ఉపాసనాకాండము ముఖ్యమైనది. వేదవిహిత ఉపాసనలలో సత్యవతీ, అంగవతీ, అన్యవతీ, నిదానవతీ అనే నాలుగురకములను శ్రీవారు విపులముగా విశదపరచిరి. వేదవాంగ్మయములోని అమూల్యరత్నములను అందరి అవగాహమునకు తెచ్చిరి. నిత్యసత్యమైన పరాత్పరవస్తువొక్క ఉపాసన, శబ్దస్పర్శ రూపరసగంధాత్మకమైన పంచభూతాత్మకమైన అంగములతో కూడిన దేవతల ఉపాసనా, రూపనామములచే ప్రత్యేకపరచిన దేవతల ఆరాధన. సోపానరీతిగా, నవవిధభక్తిని సంపాదించుకొని క్రమక్రమముగా దేవతాసాన్నిధ్యమును పొందే నిదానవతీవుపాసనా--అవి పీటిని శ్రీవారు బోధించిరి.

12వ తేదీనుంచి, 17వరకూ శ్రీవారు ప్రతిదినమూ ఉదయం 10గం॥లకు యజ్ఞవేదికకాగమించి, పూజలను అవలోకించి, వేద పారాయణము చేయువారిని దీవించి, ఋత్విక్కులననుగ్రహించి, వేలాది ప్రజలకు దివ్యదర్శనము నందించి వారి మనోభీష్టము నందించి సంతృప్తిపరచిరి.

12వతేదీ సాయంత్రము, ప్రశాంతివిద్వన్మహాసభ నుద్దేశించి బ్రహ్మశ్రీ నారాయణభట్ల కృష్ణమూర్తిశాస్త్రిగారు భాగవతములోని "గోపికాగీత"ను చదివి వ్యాఖ్యానించిరి. తరువాత శ్రీవారు "భగవంతుడు రసస్వరూపుడు అతనిని హృదయస్థానములో ప్రతిష్ఠచేసుకొని, షోడశోపచారరీత్యా పుపాసించి, ఆ రస సముద్రములో మానవుడు ఒక బిందువుగా మారిపోవలెను" అన్నారు. "గోపికల విరహవేదనాప్రవాహము ఒక మహాతపస్సాధన" అని స్పష్టపరచిరి. అవ్యక్తోపాసన సామాన్యజీవుల కసాధ్యము; వ్యక్తోపాసనలోనే ఆనందానుభూతి. దీనికి కృష్ణచైతన్యుడే చక్కని ఉదాహరణము భాగవతములోని పవిత్రత, గోపికలచరిత్రనే: వారి జీవితము కృష్ణానందనిమిత్తమై అర్పితమైనది. వారు తామే కృష్ణుడుగా మారిపోయినారు! యద్భావం తద్భవతి!" అని బోధించిరి.

13వ తేదీన, బ్రా॥శ్రీ॥ శిష్టా చంద్రమౌళిశాస్త్రిగారు వేదమంత్రములనుగురించి ఉపన్యసించిరి. వేదములు స్వతఃప్రమాణములనియూ, వాటిలో మంత్ర జిజ్ఞాసా విపులముగా కనబడునవనియూ నొక్కిచెప్పిరి. తరువాత, బ్రా॥శ్రీ॥ కులపతి సోమశేఖరశాస్త్రిగారు శ్రీవారు సాక్షాత్ పురుషోత్తముని అవతారమని సోదాహరణముగా స్పష్టపరచిరి. విద్యాసంస్థలు సేవాసంస్థలు విద్వన్మహాసభలు పీటన్నిటినీ నిమిత్తమాత్రముగా నిలబెట్టి స్వామి ధర్మసంస్థాపనాకార్యమును నిర్వర్తించెదరు. ఎంతో కార్యభారమున్నట్లు నటింతురు కానీ శ్రీవారికి ఇవన్నీ లీలామాత్రమే, వారి సంకల్ప శక్తివలననే అన్నియూ జయప్రదమగునని తెలిపిరి. శ్రీవారు జైమినీమహర్షి ప్రోక్త పూర్వమీమాంస దర్శన

మును గురించి బోధించుచూ. యజ్ఞయాగ క్రతువులలో పాటించ వలసిన క్రమశిక్షణలను వివరించిరి. తరువాత, బాదరాయణ మహర్షి విరచిత ఉత్తరమీమాంస దర్శనము బ్రహ్మస్వరూపమును నిరూపణ చేయునని తెలిపి పూర్వమీమాంసలోని కర్మమార్గమును ఉత్తరమీమాంసలోని జ్ఞానమార్గమునూ తేటతెల్లముగా విపులీకరించిరి. మంత్రోచ్చారణ సమయములో యే విధమైన మనస్తత్వము పొందియుండాలి. మననమునకు త్రాణశక్తి యెట్లరాగలదు, మొదలైన విషయములను గురించి బోధించి అనుగ్రహించిరి. శంకరుడు ఈశ్వరునినుతించుచు, ఈశ్వరుడు సర్వవ్యాపకుడని తెలిసికొని కాశికిపోవడము మొదటిపాపమనియూ, తలంపుకతీతుడవని తెలిసి తలంచడము రెండవపాపమనియూ, వాక్కుకతీతుడవని తెలిసి స్తుతించడం మూడవ పాపమనియు అన్నాడు, చెప్పిన దాన్ని ఆచరణలో పెట్టకుండుటయే పెద్దపాపము.

14వ తేదీ బ్ర॥శ్రీ॥ జమ్మలమడక మాధవరామశర్మగారు బ్రహ్మ-జీవ అభేదవాదమునుగురించి మాట్లాడుచూ ద్వైతా ద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములను విడదీసి వుపన్యసించిరి. బ్ర॥శ్రీ॥ పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు శాండిల్య నారదాదులు రచించిన భక్తిమీమాంసను అందరికీ సులభశైలిలో తెలిపిరి.

శ్రీవారు కూడ ద్వైతా ద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతవిషయమునే తీసుకొని, రామానుజాచార్యుల జీవితకథ, వారి అద్వైత దర్శనములోని విశిష్టత వీటినిగురించి దివ్యోపన్యాసమునందించిరి. Qualified non-duality అని దానిని గుర్తించు బదులు,

non-duality of the differenced అనేదే సరైన పదమ విరి. త్వమేవ సర్వం మమదేవదేవ అని రామానుజాచార్యులు ప్రపత్తిమార్గమును బోధించినారు. సముద్రము సూర్యకిరణము తో ఆవిరియై తిరిగి మేఘరూపమై, చల్లబడి, వర్షిస్తుంది, ప్రవాహంగావస్తూ కృష్ణా, గోదావరీ, తుంగభద్రా అనే వివిధరూపములతో పిలువబడుతుంది. రూపనామములు వేరైననూ అధిష్ఠానపదార్థమొక్కటే: అధిష్ఠానమునకు దూరమైనపుడె రూపనామములు: లక్ష్యార్థమునందు నది సముద్రము రెండూ ఒకటేఅన్నారు శంకరాచార్యుడు; నది సముద్రములో చేరిననూ, నది నదియే సముద్రము సముద్రమే అన్నాడు, రామానుజాచార్యుడు; సముద్రముచేరేవరకూ నది. తరువాత, సముద్రమేకానీ నదిలేదు- అన్నాడు, మధ్వాచార్యుడు, అని తెలిపిరి. అంతు, నది సముద్రమువైపు ఆతురతతో ఆవేదనతో వేరు చింతలేక యే అడ్డునూ లెక్కచేయక పారేది ముఖ్యము. మీరా కూడ 'చలో రేమన్ గంగా యమునాతీర్' అని మనసుకు బోధించినది. అంటే, ఇడాపింగలా మధ్యనున్న సుషుమ్నా నాడిలోని విశ్చల నిర్మల యోగపథము నందు మనసును నిల్పాలనేదే దానికర్థము. ఇదే వైదికోపాసన అయిన హంసగాయత్రియొక్క గూఢార్థము, అని బోధించిరి.

15వ తేది, బ్ర॥శ్రీ॥ గండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, "కర్మకాండము, ఉపాసనాకాండము, జ్ఞానకాండము అనే వైదిక విభాగములనుగురించి ఉపన్యసించి, జీవబ్రహ్మైక్యానుసంధానమే అన్నికర్మల చిట్టచివరి ఫలితము" అనిరి. తరువాత బ్ర॥శ్రీ॥ జంద్యాల పాపయ్యశాస్త్రిగారు "కావ్యములో భక్తి" అనే విషయ

మును గురించి వుపన్యసించుచూ, కల్పనచేసిన కమ్మనిపలుకే దివ్యకవిత్వమని తెలిపి, కొన్ని సంస్కృతాంధ్ర పద్యములనుద హరించి, వాటిలోని భక్తిరసమును చక్కగా వివరించి అందరినీ ఆనందపరచిరి. శ్రీవారు తమ దివ్యోపన్యాసమున, పుష్టిజీవులు, మర్యాదజీవులు, ప్రవాహజీవులు అని మూడురకముల జీవులున్నారని తెలవిచ్చిరి. ఈశ్వరానుగ్రహప్రాప్తులై వారి అనంతప్రేమను సంపాదించువారు. పుష్టిజీవులు: భక్తిశ్రద్ధలచే వేదాధ్యయనమొనర్చి, కర్మలనాచరించి, భగవత్ప్రీతికి పాత్రు లగువారు, మర్యాదజీవులు: వ్యామోహ బద్ధులై భౌతికానందము కొరకు ఇంద్రియాల వెంటబడి సుఖదుఃఖద్వంద్వములోపడి జీవితమును వ్యర్థము చేసుకొనేవారు, ప్రవాహ జీవులు, అని వ్యక్తపరచిరి. మద్భక్తాః యత్రగాయన్తే తత్రతిష్ఠామి నారద, అని భగవంతుడు హామియిచ్చారు; కాబట్టి, ఆ 'తిష్ఠ' స్థానమే, పుష్టిస్థానము. మర్యాద జీవులు వేదశాస్త్ర విహితమైన షోడ శోపచారరూపమైన పూజారాధనలు సలిపి భగవంతుని సుప్రీ తునిగా చేయువారు, ప్రవాహ జీవులు భోగభాగ్యమున మునిగి పునరపి జననం పునరపి మరణం -రావటము పోవటము - అనే సంసారచక్రములో చిక్కుకొన్న జీవులు.''అనిరి.

తరువాత, శ్రీవారు పరాశక్తి — అపరాశక్తి, ఇచ్ఛాశక్తి క్రియాశక్తి, - జ్ఞానశక్తి, - ఆహ్లాదినీశక్తి. వీటిని వివరించిరి. పతి పశు — పాశములను ప్రస్తావించి పతికిశరణుజొచ్చితే, పాశము వీడుననియూ సర్వప్రాణులకు పశుపతియే ఆధార

మనియూ తెలవిచ్చి పాశుపత వుపాసనా మార్గమును సూచించిరి.

"ప్రతిమానవుడు సుఖజీవితముగడుపవలెనని కోరుట సహజమే. అయితే, దానినాశించటమేకానీ, అందుకు కావలసిన ప్రయత్నమునకు యెవరూ పూనుకోవటములేదు: తానెవరో తెలుసుకొన్న, సుఖదుఃఖ విచారముండదు. ఈశ్వరనిర్మితమైన జగత్తంతయూ ఈశ్వరరూపమే అని భావించినపుడు, యే బాధనూ వుండదు" అని బోధించిరి

"స్వార్థరహితప్రేమ, నిష్కామకర్మాచరణ చేస్తున్నానని యెవరు చెప్పినా, అది హాస్యాస్పదమే" అంటూ, స్వార్థరహిత ప్రేమ ఒక భగవంతునియందుతప్ప యెక్కడాలేదు; తల్లిబిడ్డను ప్రేమించేది తన సంతృప్తి నిమిత్తమే, బిడ్డ తల్లిని ప్రేమించేది తన నిమిత్తమే. మానవులు యేదిచేసినా, యేదిచెప్పినా, యేది చూచినా, అది వారివారి సంతృప్తికోసమే. తామ తానుగానుండి తన్ను తాను ప్రేమించుకొనేదే, ఈ జగన్నాటకమంతా" అనిరి. ఇట్టి తత్వములు బుద్ధిగ్రాహ్యమతీంద్రియం, బుద్ధితోనే తెలిపి కోవాలి. బుద్ధి జీవితరథమును నడిపించుసారథి మనస్సనే పగ్గముతో ఇంద్రియములనే అశ్వములను విషయములనే వీధులలో నడిపించు సారథి" అని తెలవిచ్చిరి.

బుద్ధుడు సర్వం దుఃఖం దుఃఖం, సర్వం క్షణికం క్షణికం అన్నాడు. నీటిబుడగవలె క్షణికమైన దేహారాధనను తగ్గించి శాశ్వతానందప్రదాయియైన దేవారాధనసలుపలెను, అన్నారు. భక్తిలేని జ్ఞానము నిరర్థకము; భక్తివృక్షముపై జ్ఞానమునేతీగ

చక్కగా అల్లుకుపోతుంది. భక్తివున్నచోటునే జ్ఞానంపెరుగును; జ్ఞానమున్నచోటునే భక్తికి సౌందర్యము పెరుగును. వీటిలో ఏది లోపించినా, శోభావిహీనమే అని హెచ్చరించిరి.

16వ తేదీ, బ్ర॥శ్రీ॥ జమ్మలమడక మాధవరామశర్మగారు ఆపన్నివారణకూ ఐశ్వర్యప్రాప్తికీ ప్రజలు నమక చమకాదుల పఠణమునూ, యోగమాయా రూపమందు పరాశక్తి పూజనూ చేయువిధానములనను వివరించి, శ్రీ సత్య సాయి దర్శనము వలన పుష్టి. తుష్టి, యోగసిద్ధి, యాగసిద్ధి. రోగనివార ణము. భాగ్యప్రాప్తి అన్నీకలుగునని వక్కాణించిరి. తరువాత, ఇందూలాల్‌షాగారు శ్రీసత్యసాయి రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్ అనే క్రొత్త సంస్థయొక్కటివి శ్రీవారి ఆశీస్సులతో స్థాపించడమైనదని ప్రజలకు తెలిపిరి. దానిని గురించి వివరణలనిచ్చుచూ డా॥ గోకాక్‌గారు, బాలవికాస్ కార్యక్రమములవలన పిల్లలలోనూ సేవాదళ క్రమశిక్షణవలన యువకులలోనూ, మహిళావిభాగ ముల సేవాకార్యములవలన వారిలోనూ, సేవాసమితుల వివిధ కార్యకలాపములవలన సమాజముయొక్క వివిధ క్షేత్రములలోనూ నిరీక్షించు ఫలితములు సిద్ధించుచున్నవా అని సంశోధించి, తగు పరిష్కారములను సూచించి, శిక్షణక్రమములో అత్యవసరమైన మార్పులను కనిపెట్టి, ప్రకటించి, శ్రీసత్యసాయిబోధను జగద్వ్యా ప్తముచేసి, ఆ మూలకముగా మానవజాతినుద్ధరించే కైంకర్యమే ఈ ఇన్‌స్టిట్యూట్‌యొక్క కర్తవ్యమనిరి.

శ్రీవారు తమదివ్యోపన్యాసమున, "సర్వం పరవశం దుఃఖం; సర్వం బ్రహ్మమయం సుఖం" అని ఉద్ఘోషించిరి

సామ్రాజ్యపిపాసనే భోగమనియూ స్వారాజ్య పిపాసనే వైరాగ్య మనియూ తెలవిచ్చిరి. ఆత్మసామ్రాజ్యమును గుర్తించినవాడే స్వారాజ్యమున కర్హుడు. ఆ సామ్రాజ్యముయొక్క ప్రజలు జీవులు. సత్ చిత్ ఆనందస్వరూపులు. దీనిని ప్రబోధించి ప్రకటించి ప్రకాశింపజేసేదే భారతీయుల కర్తవ్యము'' అనిరి.

17వ తేదీ విజయదశమి; వేదపురుష సప్తాహ యజ్ఞపు పూర్ణాహుతి సమారంభమునకు శ్రీవారు పీతాంబరధారులై వనమాలా విభూషితులై వాయిద్యఘోష వేదఘోషములతో పూలబాటలపై యజ్ఞవేదికకాగమించిరి....నవరత్నములనుసృష్టించి పూర్ణాహుతిగావించిరి. శిర్డీబాబావారి వెండి విగ్రహమునకు రత్న ఖచిత శిరోభూషణ మొక్కటిని సృష్టించి అలంకరించి, తదుపరి ఆఖండవిభూత్యభిషేకము జేసి అందరినీ అమితానంద పరచిరి. యజ్ఞతీర్థమును ఆ విపుల జనస్తోమముపై దర్భాగ్రమునుంచి తామే చల్లి, అందరినీ పునీతులు గావించిరి.

సాయంత్రము జరిగిన మహాసభలో కర్నల్ శ్రీజోగా రావుగారు, ప్రశాంతినిలయం డెవెలప్మెంట్ ప్రాజెక్ట్ ''ను గురించి వివరములనందించి, ఆ కార్యక్రమమునకు శ్రీ నవానగర్ రాజమాతాగారు, శ్రీ పూనంచంద్ కమానిగారు, శ్రీ జలాన్ గారు, శ్రీ తారాపొరెగారు మొదలైనవారు సహకరించు చున్నారని తెలిపిరి. శ్రీవారే అన్నిటికీ మార్గదర్శకులు. స్ఫూర్తిదాయకులు సలహాదారులు పరీక్షకులు వీక్షకులు, కార్యకర్తలు అనిరి. నాలుగునెలలలో ప్రశాంతి నిలయమునందు సాధించిన నిర్మాణ

కార్యముల అనుకూల వ్యవస్థలు, పీటికితగిన సాధనసంపత్తి అవకాశముల బాధ్యతను వహించిన శ్రీ గారావుగారి భక్తిశ్రద్ధలనూ, 82సంవత్సరపు వృద్ధులైన ఎంజినీరు భావరాజు సత్యనారాయణగారి ఆనందోత్సాహములను ఆదర్శములుగా అందరూ అంమకోవలె నని శ్రీవారు తెలవిచ్చిరి. యువకులైన ఇతర ఎంజినీర్లను కూడ దీవించి శ్రీవారు వారి భేదభావరహితమైన అవిశ్రాంత పరిశ్రమను అందరూ గమనించి దాన్ని అనుసరించ వలెనవిరి.

వేలాదిమందికి ఆనందము నందించే, ఇంత పెద్ద సభా మంటపమును దసరాలోపల పూర్తి కావలెననే స్వామిసంకల్ప మునకు తోడుగా, దీనికి కావలసిన వేలాదిటన్నుల సిమెంటు ఇనుము మొదలైన సదుపాయములనందించి తానే అనేక పర్యాయములు వచ్చి పనివాళ్ళను ప్రోత్సహించిన, కమాని యొక్క భక్తికి ఇదిశాశ్వతగుర్తు, ఈ ఆడిటోరియమునకు "పూర్ణ చంద్ర" అనే నామమును నేను అంకితము చేయుచున్నాను, అనిరి. నిత్యనిర్మలనిస్వార్థమైన మనస్సుయొక్క పూర్ణాకారమే పూర్ణచంద్ర. ఈ ఆడిటోరియములో చేరువారందరి మనస్సులు పూర్ణ చంద్రులు కావలెననేది నాసంకల్పము "అని ఆశీర్వదించిరి పి.ఆర్. కమానియొక్క ఉత్సాహము, ఆయన నిరంతరమూ చేసిన స్వామిచింతన సేవాసాధన పీటిని అందరూ తమ హృదయము లలో ప్రతిష్ఠించుకోవలెనని బోధించిరి.

18వ తేది ఉదయం శ్రీవారు అఖిలభారత సేవాదళసభ్యు లంటరినీ సమావేశపరచి వారికి స్వహస్తముతోనే చీరలను, ధోతి

లను ప్రసాదించిరి. తరువాత, వారికి ఆశీస్సులందించుచూ దివ్య బోధననుగ్రహించిరి. "సేవాఅనే సాధన జీవితరహస్యమును గుర్తించే మార్గములోని మొదటి మెట్టు" అని బోధించి, త్యాగము విశ్వాసము సహనము ఇవిమూడు సేవాదళ సభ్యుల కర్తవ్యవసర మనిరి.

పాత్ర మెరిగి దానము చేయమనే సూక్తిని మీరేవిధముగా అర్థము చేసుకోవలెనన్న, సేవనందుకొనేవాని పాత్రత కాదు, సేవించేవాని పాత్రతనెరిగి సేవనందించాలి. మీ ధనబలము. బుద్ధిబలము మీశక్తిసామర్థ్యములు యెంతవరకున్నవో అంతవరకు పరుల కష్టనివారణ చేయవలెననిరి. సేవాదళ సభ్యులైన డాక్టర్ల నుద్దేశించి ప్రత్యేక సూచనలందించిరి. రోగులతో శాంతముగా మధురముగా మాట్లాడుచూ వారికి ధైర్యోత్సాహములనందించి వారి బాధను నివారించవలెననిరి. అహంకారమునకూ ఆడంబరమునకూ, తిరస్కారమునకూ, పరిహాసమూనకూ మనస్సులో చోటివ్వకూడ దనిరి. ప్రేమ నభివృద్ధి చేసుకొని, ప్రేమదృష్టితో యెల్లప్పుడూ అందరికీ ప్రేమనే పంచవలెనని హెచ్చరించిరి.

సాయంత్రము శ్రీవారి దివ్యసన్నిధిన, "కవి సమ్మేళనము" జరిగినది. బ్ర॥శ్రీ॥ దూపాటి తిరుమలాచార్యులు బ్ర॥శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు బ్ర॥శ్రీ॥ జంద్యాల పాపయ్య శాస్త్రిగారు, బ్ర॥శ్రీ॥ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, డా॥ వినాయక కృష్ణ గోకాక్ గారు, డా॥ చతుర్వేది నరసింహశాస్త్రిగారు, ప్రొ॥ కులకర్ణిగారు, యోగా కస్తూరిగారు, శ్రీ॥ఉల్లాగంటి సౌభాగ్యవతమ్మ గారు తమ కవితలను చదివి శ్రీవారి కర్పించిరి.

సంస్కృతము, తెలుగు, ఆంగ్లము, కన్నడము భాష లలో భగవానుల మహిమాతిశయములను సుస్పష్టముగా వారు వెల్లడించిరి. తరువాత, శ్రీవారు కవులకు హితవచనములనందించుచూ, ఉత్తమసాహిత్యముయొక్క లక్ష్య లక్షణములనుగురించి దివ్యోపన్యాసము నొసంగిరి. శృంగార బంగారముల కర్పితముకాక, శుష్క తర్కమును పురస్కరించని. ఇంద్రియవ్యామోహములను ప్రోత్సహించని మానవత్వము యొక్క పవిత్రతనూ, ప్రకృతిలో అంతర్గతమైన దివ్యత్వమునూ ప్రకటించే కావ్యములే జగత్కల్యాణమును సాధించును అని తెలవిచ్చిరి. నిరర్థక, నిస్సార, నిర్వీర్య, నిస్తేజ కవిత్వము ఇపుడు బయలుదేరి ఉధ్ధృతలూగుచూ జనతను అజ్ఞానాంధకారములో ముంచివేయచున్నదనిరి. ఇట్టికక్షిణిక భావములతో కావ్యమునునింపక భగవత్ లీలాగుణగణ విశేషములు ఆధ్యాత్మికభావాలు, సమరసప్రేమ, మొదలైన దివ్యోత్కృష్ట భావములతో కవితావాహినిని ప్రవహింపజేసి, లోకమును పునీతముగావించమని ఆశీర్వదించిరి.

రాత్రి 8 ౹౦౹౹లకు ఉయ్యాలోత్సవమున శ్రీవారు వేలాది భక్తులకు దివ్యదర్శనమందించి వారిని ఆనందాబ్ధిలో ముంచివేసి, వారి జీవితమును సార్థకముగావించిరి. హైదరాబాద్ సేవాదళసభ్యుల బుఱ్ఱకథాకార్యక్రమమును అవలోకించి ఆశీర్వదించిరి.

దసరామహోత్సవమునందు బాలవికాస్ బాలబాలికల కళాకౌశల్యతను ప్రకటించే వస్తువుల ఒక యెక్సిబిషన్‌ను ప్రశాంతి

మందిరములో యేర్పాటుచేసిరి. దానిని వేలాది భక్తులు చూచి ఆనందించిరి. మద్రాస్ బాలవికాస్ పిల్లలు జయదేవనాటకమును హృదయంగమమైన అభినయ గానములతో ప్రదర్శించిరి. కేరళములోని అలప్పి నగరము బాలవికాస్ పిల్లలపాటకచ్చేరి గుంటూరు బాలవికాస్ పిల్లల సక్కూబాయినాటకము. ఇతర పిల్లల నృత్యములు గీతాపఠనములు బుఱ్ఱకథలు హరికథా కాలక్షేపములు అన్నీ చాలా జయప్రదముగా జరిగినవి.

విజయదశమినాడు. (కేరళరాష్ట్రముయొక్క కళారత్నము జగద్విఖ్యాతి నార్జించినది "కథక్కళి" అనే నృత్యనాటకం) కోట్టక్కల్ ఆర్యవైద్యశాలా కథక్కళి బృందమువారు సంతానగోపాలం కిరాతార్జునీయము. అనే పురాణ కథలను నృత్యరూపకములుగా ప్రదర్శించిరి.

వంగరాష్ట్రపు ప్రఖ్యాత గాయకురాలైన శ్రీమతి జ్యోతికా రాయ్‌గారు, శ్రీమతి ప్రతిమా బ్యానర్జిగారూ. శ్రీమతి సుప్రీతి ఘోషోగారూ భక్తిగీతములను సుమధుర గాత్రముతోపాడి వేలాది సభ్యుల కమితానందము నందించిరి.



# కృపాసింధు

అమెరికాలో భగవాన్‌ను గురించిన కుతూహలము ఎంతో త్వరితగతిని అభివృద్ధి నొందుచుండెను. నేను భగవాన్ దర్శన మునకు అక్టోబరులో వచ్చుచున్నానని నాఉపన్యాసములవలన తెలుసుకున్నవారై 50 మంది చాలా ఆత్రుతతో నాతోప్రయా ణమునకు సిద్ధమైనప్పుడు నాకెంతో ఆశ్చర్యమైనది: వారిలో కొందరు యిదివరలో భగవాన్ పాదపద్మములసన్నిధిని కొంత కాలమున్నవారై నప్పటికినీ మరలఎంతో ఆత్రుతతో భగవాన్ సన్నిధికి ప్రయాణమయిరి. తక్కినవారు భగవాన్‌ని స్వప్నము లలోను, ధ్యానదృష్టిలోను దర్శించినవారై. బాబావారియొక్క అపారకరుణా పాశములతో సన్నిధికికొనిరాబడిరి. వారుయిప్పుడు యిక్కడవున్నారు. భగవాన్ సన్నిధిన వారు ఎంతగా సంతోష సంతృప్తిలో మునిగి తేలారో, ఎంతవున్నతమైన ఆధ్యాత్మిక అనుభవాలను పొందియున్నారో వారిలో ప్రతిఒక్కరూ జీవిత ములో ఎంతో, ఎన్నో చూచినవారైనప్పటికీ ఆనందబాష్పములు రాలుస్తూ తాము మాటల్లో చెప్పలేమంటున్నారు. తమజీవిత ములో తాము ఎన్నడూ పొందియుండ లేదంటున్నారు.

1966 నుండి భగవాన్ పాదపద్మముల సన్నిధికి రావటం నాకిది 19వసారి. అయినప్పటికీ ప్రతిఒక్కసారి నిత్యనూతనముగా వారనుగ్రహించుచున్న ఆధ్యాత్మికానందాబ్ధిలో మునిగిపోవటం జరుగుతూనేవుంది.

పెకాటె (మెక్సికో) ఇంద్రాదేవి

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్టు మరియు రిజిష్ట్రేషను చార్జీలను మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోష్టు చార్జీలు క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోష్టుచార్జీ మరియు ప్రతి ఆర్డరుతోనూ రిజిష్ట్రేషను చార్జీ రూ. 1-05పై జతపరచి, కావలిసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|
| **తెలుగు:——** | | |
| 1. సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. .. .. (2) | 4-00 | 0-45 |
| 3. మణిమాల | 1-00 | 0-15 |
| 4. భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5. అర్పణ | 1-00 | 0-10 |
| 6. సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8. గీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. వచనామృతము | 4-00 | 0-30 |
| 10. ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11. గీతాభావ ప్రకాశము | 15-00 | 1-00 |
| 12. బోధామృతము | 0-50 | 0-10 |
| 13 సాయిమహిమ | 1-00 | 0-20 |

| | | |
|---|---|---|
| 15. దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 16. స్తుతి తరంగిణి (2వ భా) | 0-50 | 0-10 |
| 17. దివ్యజ్ఞానదీపికలు | 0-75 | 0-20 |

కన్నడం:-

| | | |
|---|---|---|
| 1. సత్యం శివం సుందరం | 3-50 | 0-30 |
| 2. జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:——

| | | |
|---|---|---|
| 2. 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. గీతావాహిని | 3-00 | 0-15 |
| 5. ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 8. ధర్మ వాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు:——

| | | |
|---|---|---|
| 1. సత్యసాయి స్పీక్స్ (1భా) | 4-00 | 0-25 |
| 2. ,, ,, (2భా) | 4-00 | 0-30 |
| 3. ,, ,, (3భా) | 4-00 | 0-30 |
| 4. ,, ,, (4భా) | 5-00 | 0-40 |
| 5. ,, ,, (5భా) | 5-00 | 0-40 |

| | | | |
|---|---|---|---|
| 6. | సత్యసాయి స్పీక్స్ (6భా) | 5-00 | 0-40 |
| 7. | .. .. (7భా) | 7-00 | 0-65 |
| 8. | సాయిబాబ (అమేరికన్ ఎడిషన్) సత్యం శివం సుందరం (1వభా) | 6-00 | |
| | ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 10. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 11. | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 12. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 13. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 14. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 15. | భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 16. | భజన్‌సాంగ్స్ | 2-00 | 0-20 |
| 17. | ధ్యానవాహిని | 2-00 | 0-15 |
| 18. | సత్యం శివం సుందరం (3వభా) | 6-00 | 0-40 |
| 19. | సేక్రెడ్ ల్యాంప్స్ ఆఫ్ డివైన్ విస్‌డమ్ | 1-50 | 0-20 |
| 20. | ది బర్డన్ ఆఫ్ ది బ్యాడ్జ్ | 1-50 | 0-20 |

అరవం:— ...

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందవం (1వ బా) | 3-50 | 0-40 |
| 4. | .. .. .. (2వ బా) | 4-00 | 0-30 |
| 5. | భజనావళి | 1-00 | 0-15 |

| | | | | |
|---|---|---|---|---|
| 6. | అవతారమొళిఅముదం | (1వ భా) | 3-00 | 0-30 |
| 7. | ,, ,, | (2వ భా) | 3-00 | 0-35 |
| 8. | సాయిమహిమ | | 1-00 | 0-10 |
| 9. | ధర్మ వాహిని | | 1-50 | 0-15 |
| 10. | సందేహనివారిణి | | 2-00 | 0-25 |

హిందీ:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |

బెంగాలి:——

| | | | |
|---|---|---|---|
| 1. | ధ్యానవాహిని | 1-75 | 0-10 |

గుజరాతి:——

| | | | |
|---|---|---|---|
| 1. | అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. | కథాసుధ | 2-00 | 0-15 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1. | భజనావళి | 0-50 | 0-10 |
| 2. | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

మేనేజర్, సనాతన సారథి.



# గమనిక — పత్రికల చందాలు. పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు మరియు ఇంగ్లీషు భాషలతో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా : 4రు॥ ఒక సంవత్సరము నకు తక్కువకాని 5 సం॥ల కెక్కువకాని చందాలు స్వీకరింపబడవు.

2. చందాలనుపంపించునపుడే ఈక్రింది వివరములను సుస్పష్టముగా తెల్పవలెను.

ఎ) మొదటిసారిగా చందాలను పంపేవారు "క్రొత్తచందాదారు", అని వ్రాయవలెను.

బి) ప్రస్తుతచందా గడువు పొడుగించుటకు, తనచందా నెంబరునుచందాపంపించు సమ యమునందే తెలియజేయవలెను.

సి) తెలుగు పత్రికకావలెనో లేక ఇంగ్లీషుపత్రిక కావలెనో స్పష్టముగావ్రాయవలెను.

డి) చందాదారు తన పేరును పూర్తివిలాసమును స్పష్టముగా తెలియునట్లు వ్రాయ వలెను. M.O. ద్వారా చందానుపంపించువారు వారిపేరును పూర్తి విలాసమును M.O. కూపను వెనుకభాగమున వ్రాయుట అత్యావశ్యకము.

3. పత్రికలుగాని పుస్తకములుగాని V. P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటివివరములను పైకముతోపాటుగా తెలియపరచవలెను. (M.O. ద్వారా పైకమును పంపించువారు కూపనులోనేకావలసినపుస్తకముల వివర ములను తెలియజేయవలెను.)

4. పత్రికకుగాని పుస్తకములకుగాని పైకమును పంపించువారు తమచెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ఆర్డర్లను, మనియార్డర్లను. "సనాతన సారథి", ప్రశాంతినిలయం పోస్టు. అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు బ్యాంకిఖర్చులనుకూడా కలిపి, మొత్తమును పంపవలెను. పత్రికగాని, లేక. పుస్తకములుగాని చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

5. పైవిషయములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములను "మేనేజరు, సనా తన సారథి, ప్రశాంతినిలయంపోస్టు, అనంతపురంజిల్లా. ఆంధ్రప్రదేశ్ అనుచిరునామాకు వ్రాయవలెను అట్లువ్రాయు ఉత్తరప్రత్యుత్తరములలో తమచందానెంబరును లేక బుక్ ఆర్డరునెంబరును, తప్పక వ్రాయవలెను, అట్లు వ్రాయనియెడల జవాబుఇచ్చుటకు ఆల స్యమగును.

6 పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

---

ఆంధ్రప్రదేశ్ అనంతపురంజిల్లా ప్రశాంతినిలయమునందలి శ్రీ సత్యసాయి ముద్రణాలయ మునందు యన్ కస్తూరి గారిచే ముద్రింపబడి టి.వి.రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి ట్రస్ట్ తరపున ప్రచురింపబడినది. ఎడిటర్, యన్. కస్తూరి ఎం. ఏ. బి, యల్.

